# ఈశ్వరతారావళి.



జనమంచి సీతారామస్వామి

"గీ. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ దలఁపఁడేని
కలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు."



మొదటికూర్పు 250.





శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.



పీఠాపురము.

1919.

# ఈశ్వరతారావళి.

జనమంచి సీతారామస్వామి

"గీ. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ దలఁపఁడేని
కలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు."



మొదటికూర్పు 250.





శ్రీ విద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

పిఠాపురము.

1919.

# విజ్ఞాపనము.

భక్త్యావృత్తిమును హృదయంగమముగవిందుసేయుభాగవతాదిపురాణరత్నంబులును, శతకరాజంబులును తారావళులు ననేకంబు లున్నవని యెఱింగియు నేనీచిన్నిపొత్తముఁ బ్రకటించుటకుఁ గారణము కవితాప్రవీణుఁడ ననికాదు, పరమభక్తావతంసుఁడ ననికాదు, నూతనవిషయబోధనాసమర్థుఁడ నని కాదు. విశిష్టగ్రంథములనుండి యేంచి భక్తిరసపూరితంబు లైనపద్యంబుల నేనప్పుడప్పుడు చదువగా విన్నమిత్రులలోఁ గొందఱు నాతో "మీరుకూడ భగవంతునిగూర్చి యేవైనఁ బద్యంబులఁ గొన్ని చెప్పుట మాకోరిక" యని పలికి నాకమితప్రోత్సాహముఁ గలుఁగఁజేసిరి. "అట్లె ప్రయత్నించెదను" అని, యథాశక్తిని, దంద్రికొక్కనూలిపోగను సామెతను, ఈశ్వరునిపావననామమును స్మరించి యిరువదియేడుపద్యములఁ జెప్పితిని. "బాగుగ నున్నవి" అని పెరుగ హెచ్చరింపఁబడి, వీనిఁ జదివి కొందఱేని సంతసముఁ బడసినఁ ధన్యుఁడనే యని భావించి "ఈశ్వరతారావళి" ని, దీనితోఁ బాటు "సుబోధసుధ" యని పేరుపెట్టి శ్రీమచ్ఛంకరకృతశ్లోకాంధ్రీకరణముసు బ్రకటింపఁ

# విజ్ఞాపనము.

భక్త్యామృతమును హృదయంగమముగవిందుసేయుభాగవతాదిపురాణరత్నంబులును, శతకరాజంబులును తారావళులు ననేకంబు లున్నవని యెఱింగియు నే నీచిన్నిపొత్తముఁ బ్రకటించుటకుఁ గారణము కవితాప్రవీణుఁడ ననికాదు, పరమభక్తావతంసుఁడ ననికాదు, నూతనవిషయబోధనాసమర్థుఁడ నని కాదు. విశిష్టగ్రంథములనుండి యెంచి భక్తిరసపూరితంబులైనపద్యంబుల నేనప్పుడప్పుడు చదువగా విన్నమిత్రులలోఁ గొందఱు నాతో “మీరుకూడ భగవంతునిగూర్చి యేవైనఁ బద్యంబులఁ గొన్ని చెప్పుట మాకోరిక” యని పలికి నాకమితప్రోత్సాహముఁ గలుఁగఁజేసిరి. “అట్లె ప్రయత్నించెదను” అని, యుడుతాభక్తిని, దండకొక్క నూలిపోగను సామెతను, ఈశ్వరునిపావననామమును స్మరించి యిరువదియేడుపద్యములఁ జెప్పితిని. “బాగుగ నున్నవి” అని తిరుగ హెచ్చరింపఁబడి, వీనిఁ జదివి కొందఱేని సంతసముఁ బడసిన ధన్యుఁడనే యని భావించి “ఈశ్వరతారావళి” ని, దీనితోఁ బాటు “సుబోధసుధ” యని పేరుపెట్టి శ్రీమచ్ఛంకరకృతశ్లోకాంధ్రీకరణమును బ్రకటింపఁ

చూనితి. గుణగ్రహణపారీణు లగుచదువరు లిందలిదోషంబులఁ బరిత్యజించి, విషయప్రాశస్త్యమునుబట్టియైన గుణమున్న దాని నే పరిగ్రహించి యామోదింపఁ బ్రార్థితులు.

“చ. ఎనయఁబ్రసూనదామ మెవరేఁ కియఁగూర్చినఁ నందుఁగల్గువా
సనలకుఁ గాదె మానవులు సంతసమందుదు రట్లె నట్టిపా
వనతరశంభుభక్తి యనువాసనకుఁ మది మెచ్చి మత్కృతిం
గనుగొని తప్పులెన్నక తగం గరుణింపుదు సత్కవీశ్వరుల్.”

సంస్కృతాంధ్రహూణభాషావిశారదులును, మద్గురువర్యులును, బంధువులును, మిత్రులు నైనబ్రహ్మశ్రీ దంతుర్తి సుబ్బారాయశాస్త్రిగారికి నాహృదయపూర్వకవందనసహస్రములు.

కమ్మవంశజులు లైనశ్రీవల్లూరి అమ్మన్నగారికుమార్తెయును, శ్రీమంతులైనబిక్కిని వెంకన్నగారిధర్మపత్నియును, భక్తురాలు నైనపద్మమ్మగారయాచితంబుగ వలయుద్రవ్యము నొసంగి దీనిని ముద్రింపించినందున నాసాధ్వీమణికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

సర్వఫలప్రదాతయగుసర్వేశ్వరుఁ డందఱకు, నిరంతరము భక్తిసుధాసింధువున నోలలాడుభాగ్యము నను గ్రహించుఁగాక!

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.

పిఠాపురము.
22-1-19.

జనమంచి సీతారామస్వామి.

ఓం.

# ఈశ్వరతారావళి.



ఉ. శ్రీరమఁ బొంద వీవని యెఱింగియు సంపద లిమ్మటంచు నీ
గోరను గాని నీకొఱకుఁ గూర్చెద వాక్సుమదామ మెంత యో
కూరిమితోడఁ; దోడ్పడుము; కొంచెపు వాఁడని వీడఁబోక. నా
నేరము లెంచఁబోక మది నిల్పుమి నెయ్యము మీఱ నీశ్వరా. 1

ఉ. ఎంతగఁ గొట్టుకొన్న మన సెన్నఁడు నీపయి నిల్వ లేదయో!
చింతలమున్గుచుండుఁ; బలు దిక్కులఁ బోయియుచునుండు నెప్డుదు
ర్భ్రాంతులఁ బట్టియుండును; విరామము లేక యథేచ్ఛఁ దిర్గుఁ; గా
సంత సుఖంబు లేదు నిజమయ్య కృపామతిఁ గావు మీశ్వరా. 2

చ. తెలియక కొన్నియున్, దెలిసి తెంపున నెన్నియొ ఘోరపాపముల్
పలుకులఁ జేతలన్ మఱియు భావముచే నొనరించి. వానినిన్
దలఁచి తలంచి కుందు నను దథ్యముగా దయయుంచి ప్రోవఁగన్
బలు మఱు నీదు నామమును భక్తి జపింతును; తండ్రి! యీశ్వరా.

ఉ. పంతముఁ బూని నన్నుఁ బలు బాములఁ బెట్టుట నీకు న్యాయమే?
యెంతగఁ గష్ట పెట్టుదువొ! యెప్పుడు నిన్ను మదిం దలంతు; నీ
కింత వరాకు కల్గిన మఱెవ్వరు దిక్కు మహానుభావ! నా
చింతలఁ దీర్చి శాంతి దయ సేయుము నిన్ను భజింప, నీశ్వరా. 4

ఉ. అక్కఱ లేదు వాహనము; లక్కఱ లేదు యశంబు; స్తోత్రమా
యక్కఱ లేదు; జవ్వనులు నక్కఱ లే; దధికారయోగమా
యక్కఱ లేదు; నిక్కముగ నక్కఱ లేదిల నట్టిభోగముల్;
చిక్కులఁ బెట్టకుండ ననుఁ జెంతను జేర్పినఁ జాలు నీశ్వరా.5

ఉ. నీదయ లేకపోయినను నినె సుమీ మది నమ్మియుందు; నన్
గాదని యేరినైన నికఁ గావఁగ నేమన నెట్టులోర్వనో!
మోదముఁబొందినీకెపుడు మ్రొక్కెద దాసుఁడ నంచుఁ బల్మఱున్;
బీదను గాన నాకు నిదు బిచ్చము లేదనఁబోక యీశ్వరా.6

ఉ. ఎన్నిపరీక్షలందు జయమైనను, వేతన మెంత తెచ్చినన్,
మన్నన నెంతపొందినను, మాటల నెంతటిప్రజ్ఞఁ జూపినన్,
బున్నెము నొందలేఁడుగద పూరుషుఁ డెవ్వఁడు నీతిలేనిచోఁ;
దిన్నఁగ దిద్ది నానడతఁ, దీర్పుము నాపరితాప మీశ్వరా!7

ఉ. పుట్టిననాటనుండియును బొట్టకుఁ బట్టకె దేవులాట; నే
నెట్టులునిన్నుఁగొల్వఁగల? నెవ్వఁడుహాయినిఁగాంచుఁ బ్రాణము
క్కట్టులు తీరి? నీపరమకారుణికత్వముఁ జూపవేల నీ
విట్టు లుపేక్ష చేసిన మ తెవ్వరు ప్రోతురు నన్ను నీశ్వరా. 8

ఉ. తప్పనియెంచ కెందఱినొ దాసులపోలిక నాశ్రయించుచున్
జెప్పఁగరానికృత్యములఁ జేయుచు విత్తముఁ గూర్పనోపు నే?
నెవ్వఁడు డబ్బుడబ్బనుచు నేపలు పాట్లు పడంగ నేల? నిన్
దప్పక కొల్చుభాగ్యమును దప్పమ తేమియుఁ గోర నీశ్వరా.9

ఉ. ఇల్లని వాకిలంచు మది నెప్పుడు నాలని చూలటంచు నే
తల్లడమంది మోహమగుదారిని పోదురు మూఢమానవుల్;
కల్లగదా శరీరమని, కామవిలోలుఁడు గాక పూతుఁడై
యుల్లమునందునిన్ గొలుచునుత్తమపూరుషుఁడెప్డునీశ్వరా.10

చ. తనువు ననుగ్రహించితివి తావకసేవకుఁ గాదె? కాని, నీ
కనికర మున్నఁగాని, యెటు కల్గును నా కటువంటిభాగ్యమే
ననయముదుష్పథంబున నెయాధుఁడనై చరియించుచుంటి;నా
మనవినిఁ జిత్తగించి యిఁక మక్కువతో నను జ్ఞానిఁ జేయవే;
తనయుఁడు తప్పొనర్చినను దండ్రికిఁదప్పునె ప్రేమయీశ్వరా.

చ. మును దనుజాత్మజున్ గరిని ముప్పున పీడక కాచినాఁడవం
చునుతులు సేయనేల? యదిచోద్యమె యాశ్రితలోల! దీనులన్
మనుచుట నీకు దీక్షకద; మమ్ములమాత్రము జూడకుందువా
యనిమదినమ్మియుంటినిఁకనైనను సౌఖ్యమొసంగుమీశ్వరా.

ఉ. ఎంతటివిత్తమున్న నిల నేమియు సౌఖ్యము లేదు; కా
నంతయు దోడనుంచుకొనఁజాలము ప్రాణములూడిపోవుచో;
నంతటికాని కేల జనులందఱు మోహముఁ జెందియుందురో!
యంతయునింద్రజాలమయినట్టులుతోఁచును నాకునీశ్వరా.13

మ. సదయాత్ముండవు గాన నెప్పుడును మాసంరక్షణార్థంబె చే
యుదు వేకార్యముచేసినన్ ధరణి మేమున్నంతకాలంబు; నా
కదియీవే యిదియీవెయంచు మనుజుం డజ్ఞానియైనిన్నుఁదా
మదిఁ బ్రార్థింపఁగనేల!నీవెఱుఁగవే! భక్తప్రియా!యీశ్వరా.14

శా. ఎన్నోరీతుల వేఁడుచుంటిఁగద; న న్నేదారి రక్షింతువో?
మున్నా ద్రౌపదిఁ గాచినాఁడవఁట; యో పుణ్యప్రదా! దీనుల
న్నన్నీకెంతయు ప్రీతియుంచుఁ దెలిసెన్ నాకున్; జగంబందు నీ
కన్నన్మిక్కుపుమిత్రుఁడుండడనివక్కాణింతునోయీశ్వరా.16

ఉ. ఎప్పుడొ చావు తప్పదని యెవ్వ రెఱుంగరు? కాని, మత్తులై
యెప్పటికప్పుడే మఱచి యెన్నెయొ పాపము లాచరించుచున్
జెప్పఁగరానిబాధపడి, చేసినదానికి నేడ్తు రందఱో!
యెప్పుడు మోదమిచ్చు నదియేదన, భక్తియె కాదె యీశ్వరా.

ఉ. అన్నముఁ బెట్టుమయ్య యని యాఁకొని వేఁడినమాలవాని ర
మ్మన్నయటంచు సోదరునియట్లు ముదంబున వానికష్టముల్
గ్రన్నన దీర్చి నీపదముఁ గాంచెను మున్నొకరాజభక్తుఁడై;
యెన్నఁగరానిజ్ఞాన మది! యెప్పుడుకల్గునొ నాకునీశ్వరా.17

మ. కరుణాసాగర! యెట్టుప్రోతువని నేఁ గన్పెట్టుకొన్నాఁడ; న
వ్వరిపాదంబులఁ బట్టలేను సిరులన్ వాంఛించి; యెల్లప్డు నీ
చరణాబ్జంబుల భక్తిఁ గొల్చుటకు నేసంపత్తిలన్ సాటియా?
నరయంగా రత్నము నీశిఫూనకు నెవండాశించునో యీశ్వరా.18

ఉ. నాటకరంగ మీజగము; నర్తకులందఱు స్త్రీలుఁబూరుషుల్;
పాటల నాటలం గడచు బాల్యము సర్వము; కామచేష్టలన్
జాటుమయౌవనం బరుగుఁ;జాల నసౌఖ్యముచేటు వార్ధకం;
బేటికి నాయు వీసరణినె గతియించిన నెప్డు? తండ్రి! యీ
పాటికిఁ జాలునాయనుభవం; బిఁక నిన్ను గ్రహించు మీశ్వరా.19

చ. అనిశము సృష్టియెల్లఁ గరుణాకరమూర్తి వటంచుఁ దెల్పగా
మనమున నమ్మియుంటి; ననుమానము లేదిఁక; లోకపాలకా!
నినుఁ గనుగొన్నఁ డబ్బునని నిత్యము నుచ్ఛ్వాసలూరుచుంటి;నీ
తనువునఁ బ్రాణమున్నపుడె తప్పక తీర్పుము కోర్కె నీశ్వరా.20

శా. ఎన్నాళ్ళిట్టులు బాధనొందవలె? నే నేపాపముల్ జేసితిన్?
నిన్నున్ స్వామి మనరీతి నమ్మ నొరులన్; నీకన్న డక్కెవ్వరో
యన్నా! విన్నపమింక నైన వినవే? యయ్యో! మనశ్శాంతి లే;
దెన్నేనిన్ దినముల్ వృథాకడపినా నేమందువో!యీశ్వరా.21

చ. సిరులను రోసి సంతతముఁ జిత్తము నీపయి నిల్పినాఁడు; నీ
చరితముఁ దేనెలుట్టిపడఁ జక్కని యాంధ్రమునందుఁ జెప్పి,యే
నొరునకు నియ్యనంచుఁ బ్రియమొప్పఁగ నీకదియిచ్చి తృప్తుఁడై
వఱలినవాఁడు పోతన; యెవండిల నాతనిసాటి? యీశ్వరా.22

ఉ. చుక్కల నొప్పు నంబరము చూడఁగ నెంతయు నేత్రపర్వమై,
చక్కఁగ జాటు నీమహిమ సర్వము నద్భుతలీల ; నందియుం
జెక్కడిదింక? నాస్తికుఁడ నేనను మూఢుఁడు కూడ రాత్రియం
దక్కజమందినిన్ హృదయమందుఁ దలంపక యున్నె యీశ్వరా.

ఉ. ఎవ్వఁడు నీపదాబ్జముల నెప్పుడు భక్తినిఁ గొల్చుచుండునో
యెవ్వఁడు నీకృపామహిమనే తనుపొందక ప్రస్తుతించునో
యెవ్వఁడు నీకుఁ బ్రీతికర మేదియొ దానినె సల్పుచుండునో
యవ్విమలాత్ముఁ డొందు ననయమ్ము నఖండసుఖమ్ము నీశ్వరా.

ఉ. రావణుఁ జంప ధాత్రి రఘురాముఁడవై జనియించినప్పు డా
పావనమూర్తియౌ హనుమ భక్తిసుధాంబుధిమున్గి, నిన్ను, నీ
తావనితామతల్లిని సతంబును గొల్చినరీతి, నేను, నీ
సేవను జేయు టెన్నఁటికిఁ జేకురునో కద! తండ్రి!యీశ్వరా.25

ఉ. చేయఁగలేను జన్నములు; చేయఁగలేను తపంబు లేవియున్;
జేయఁగలేను దానములు చేతను దమ్మిడి కల్గకుంటచేఁ;
జేయఁగలేను శాస్త్రములు చెప్పినచొప్పునఁ గర్మనిష్ఠయున్
మాయలు లేక తెల్పితిని;మాయలఁబన్నక బ్రోవుమీశ్వరా.26

ఉ. మానుషజన్మ దుర్లభము మాధవసేవను మానఁబోకుఁ డో
మానవులార యంచు మతిమంతులు బల్కుదు; రైన నేమి?య
జ్ఞానుల కెట్లు కల్గు సువిచారము నీకృప లేకపోయినన్;
నే నవివేకిఁగానఁ గరుణింపుము భక్తునిఁ జేసి, యీశ్వరా. 27

చ. ఎఱుఁగను వేదశాస్త్రముల; నేమియువ్యాకరణంబు రాదు;నా
కెరయఁ గవిత్వమందు నిసుమంతయు నేరుపులేదు; తండ్రి! నీ
కరుణనుమాత్రి నమ్మితిని; కావునఁ దీనిఁ బరిగ్రహింపుమీ
యరమరలేక యంచు వినయమ్మునఁ బ్రార్థనసేతు నీశ్వరా.

ఈశ్వరతారావళి సంపూర్ణము.

ఓం.

# సుబోధసుధ

(శ్రీమచ్ఛంకరాచార్యకృతశ్లోకాంధ్రీకరణము.)

తే. గీ. పూర్వకృతకర్మకొలఁదిని భోగమబ్బుఁ;
గనుక ధనతృష్ణ నుంచకు మనమునందుఁ;
జింతలేక ప్రాప్తమునకు సంతసించి
ముక్తినొందు మీశు భజించి మూఢచిత్త! 1

తే. గీ. జవ్వనులగబ్బిగుబ్బలచక్కఁదనముఁ,
బొక్కిలిగభీరతయుఁ గని మోహమంద
క, యవి మాంసవసాదివికారము లని
మాటిమాటికి భావించిమనసునందు,
ముక్తినొందుమీశుభజించి మూఢచిత్త! 2

తే. గీ. పద్మదళమందలిజలంబువగిది నాయు
వెంచఁగఁ జంచలము; ప్రపంచమెల్ల
వ్యాధ్యహంకారపీడిత మని యెఱింగి,
యఖిలలోకము కడుదుఃఖహతము గాన,
ముక్తినొందు మీశు భజించి మూఢచిత్త! 3

తే. గీ. మనుజుఁ డెంతకాలము ధనమును గడింప
శక్తుఁ డంతధనుక ననురక్తిఁ జూపు
చుండ్రు భార్యాదు లతనిపై; నొడలిదార్ఢ్య
మడఁగి నప్పు డాతనివార్త నరయ రెవరు;
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త! 4

తే. గీ. మానవున కెంతకాలము ప్రాణముండు
నంతపరకును గుశలము నరయుచుండ్రు
గేహమందుఁ; బ్రాణము లేనిదేహమందు
భార్యకైన వెఱపె! దీనిభావ మెఱిఁగి
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త!

తే. గీ. అర్థమెప్పుడు నరున కనర్థమగును
గాని లేశమాత్రమును సుఖమ్ము నీదు;
ధనముఁ గల్గినవానికిఁ దనదుపుత్రు
లన్నను భయంబె; సర్వత్ర యుట్లె కాన
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త! 6

తే. గీ. బాలుఁడైనప్డు క్రీడావిలోలుఁ డగును;
తరుణుఁ డైనప్డు మరగును దరుణిపొందు;
వృద్ధుఁ డైనప్డు చింతల వేఁగియుండుఁ;
గాని దేవునిఁ దలఁపఁ డేమానవుఁడును;
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త! 7

తే. గీ. ఎట్టిది సతియనఁగఁ? సుతు లెట్టివారు?
వారికిని నీకుఁ గల్గినవరుస యేమి?
యిట్టిసంసార మతిచిత్ర మీజగాన;
నీవెవాఁడవు? నీవిట కేస్థలంబు
నుండివచ్చితి? వెంతభ్రాంతుండ వన్న!
దీనియందలితత్త్వంబుఁ దెలిసికొనుచు
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త! 8

తే. గీ. సజ్జనులసహవాసి నిస్సంగుఁడగును;
మోహ ముడుఁగు నిస్సంగత్వముఁ గనినంత;
మోహమును వీడఁ బరతత్త్వము గలుఁగు; నది
ప్రాప్తమైన జీవన్ముక్తిఁ బడయఁగలఁడు;
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త! 9

తే. గీ. ఉండునె చెఱువన్నది జలం బెండిపోవ?
యౌవనం బేగఁ గామము నడఁగకున్నె?
భాగ్యము నశించునెడఁ బరివార మున్నె?
సత్య మెఱిఁగినవెన్క సంసార మేది?
ముక్తి నొందు మీశు భజించి మూఢచిత్త! 10

తే. గీ. ధనమును బరివారమును యౌవనము నున్న,
గర్వమునఁ బ్రవర్తింపకు; సర్వమును క్ష
ణాంబులోనహరించుఁ గాలంబు; కాన

నిట్టిమిథ్యాసుఖంబులఁ బట్టుపడక,
ముక్తినొందు మీశుభజించి మూఢచిత్త! 1

౪. వచ్చినదినములు ఋతువు ల్వచ్చుచుండుఁ;
గాలము పరిభ్రమించుచుఁ గడచుచుండు;
నాయువును దరగుచునుండు; నైన నేమి?
నీదుతృష్ణకుఁ జలనము లేదుసుమ్మి!
ముక్తినొందు మీశు భజించి మూఢచిత్త! 1

జ న మం చి సీ తా రా మ స్వా మి,

మహామహోపాధ్యాయుఁడు.

ఆర్. సి. హెచ్. హైస్కూలు, పిఠాపురము.

సంపూర్ణము.



